

బతుకుబాటలో...
మలుపులెన్ని ఉన్నా
చివరి మలుపే
మహోన్నతిగా మార్చుతుంది
మలుపే లేదని భ్రమిస్తే
మట్టిలోనే చేర్చుతుంది

విన్నూత్న ప్రయోగాలే
విలక్షణానికి టానిక్కులవుతాయి
బతుకుబండికి
ఇంధనమవుతాయి
బండిని -
బతుకు బండిని
ముందుకు నడిపిస్తాయి

- వేముల శంకర్

# బతుకుబాటలో...

## కవితా సంపుటి

వేముల శంకర్



# బతుకు బాటలో.....

(కవితా సంపుటి)

రచన

**వేముల శంకర్**

ప్రచురణ

విశాల సాహిత్య అకాడమి

404, ఉషాకిరణ్ ఆర్కేడ్, ఉస్మానియా యూనివర్సిటీ రోడ్,

విద్యానగర్, హైదరాబాద్ - 500 044.

# బతుకుబాటలో . . .

(కవితా సంపుటి)

వేముల శంకర్

**Batuku Batalo...**
Telugu Poetry

VEMULA SHANKAR

First Edition : 2006



రచయిత చిరునామా
వేముల శంకర్
ఇం.నె. 3-9-212, శాలివాహన నగర్,
రెడ్డి కాలనీ, హన్మకొండ 506 001.
ఫోన్ - 0870 - 2452489, సెల్ - 9849283870

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారి
ఆర్థిక సహాయంతో ప్రచురించబడినది.

Publishers

Vishala Sahitya Academy
404, Usha Kiran Arcade, O.U. Road,
Vidyanagar, Hyderabad - 500 044.
Ph. : 040-65164929, 9391036987

వెల : రూ **40/-**

Composing : Sri Sai Jyothi Graphics, Hanumakonda
Printed at : Karshak Art Printers, Hyderabad Ph: 040-27618261

## నిజమైన శ్రామికవర్గ రచయిత వేముల శంకర్

**- బి.యస్. రాములు**

శ్రామికవర్గ దృక్పథం మార్క్సిజం ఒక తాత్విక రాజకీయ ఆర్థిక దృక్పథంగా విస్తరిస్తున్న కొద్దీ ప్రపంచవ్యాప్తంగా ప్రాచుర్యం పొందింది. శ్రామికవర్గ ఉద్యమాలు, శ్రామికవర్గ నాయకత్వంలో విప్లవాలు, శ్రామికవర్గ నాయకత్వంలో సోషలిజం, కమ్యూనిజం వ్యవస్థలు సాగాలని ప్రపంచవ్యాప్తంగా ఒక గొప్ప మలుపుకు అవి కారణమయ్యాయి. అలా ధనికులు, పేదలు, పీడకులు, పీడితులు, పాలకవర్గాలు, పాలితవర్గాలు అనే ద్వంద్వసమాసాలు ప్రాచుర్యంలోకి వచ్చాయి. మార్క్సిజం చదవకపోయినప్పటికీ ఈ ద్వంద్వసమాసాలు ప్రజలు ఇట్టే పట్టేసుకున్నారు. వారి జీవితమే వారికి ఆ అవగాహనను ఇచ్చింది. సిద్ధాంతం దానికి మద్దతు ఇచ్చింది.

ఇలా సుమారు 350 సంవత్సరాలనుండి ఆదర్శ సామాజిక వ్యవస్థల గురించి, సోషలిస్టు సమాజాల గురించి ప్రయోగాలు జరిగాయి. ఉద్యమాలు కొనసాగుతున్నాయి. ఇలా రష్యా, చైనా, క్యూబా మొదలైన దేశాల్లో విప్లవాలు విజయవంతమయ్యాయి. శ్రామికవర్గం నుండి ఎదిగారు. మహారచయితలయ్యారు. రష్యా నుండి అట్టడుగు వర్గాల నుండి ఎదిగి గోర్కీ ఒక మహారచయితగా ప్రపంచానికి మార్గదర్శకుడయ్యాడు.

భారతదేశంలో కూడా 1920 నుండి శ్రామికవర్గ దృక్పథంతో సామాజిక ఉద్యమాలు, సోషలిస్టు, కమ్యూనిస్ట్ పార్టీలు ప్రజల్లో గొప్ప చైతన్యాన్ని తీసుకువచ్చాయి. మహారచయిత మున్షీ ప్రేమ్‌చంద్ శ్రామికవర్గ రచయితల సంఘంగా అభ్యుదయ రచయితల సంఘాన్ని 1935 లో ఏర్పాటుచేసి గొప్ప స్ఫూర్తిని అందించాడు. ఆయన వందేళ్ల క్రితమే శ్రామికవర్గాల స్వీయచరిత్రలే రేపటి నవలలు, సాహిత్యం అని స్పష్టం చేశారు.

అయితే అక్షరాస్యత పేదప్రజలకు అందడం నెమ్మదిగా సాగడంవల్ల శ్రామికవర్గాల నుండి ప్రేమ్‌చంద్ ఆశించినంత వేగంగా శ్రామికవర్గాల నుండి

రచయితలు ఎదగలేదు. శ్రామికవర్గాలకు, పాటకు కళారూపాలకు మధ్య విడదీయరాని ఒక అనుబంధం వుంది. అందువల్ల శ్రామికవర్గాల నుండి సుద్దాల హనుమందు, నాజర్, గద్దర్, వంగపండు, గూడ అంజయ్య, సుద్దాల అశోక్‌తేజ, అందెశ్రీ, గోరటి వెంకన్న మొదలైనవాళ్లు పాట కవులుగా, కళాకారులుగా దేశానికి, రాష్ట్రానికి నాయకత్వం అందించినట్టుగా రచయితలు ఎక్కువగా ఎదగలేదు.

శ్రామికవర్గ రచయితల పేరిట మధ్యతరగతి 'భద్రలోగ్' ఊరేగుతున్నారని వారి పెటీబూర్జువా స్వభావాలను, ఆశలను, దృక్పథాన్ని, వస్తువును శ్రామికవర్గానికి చెందినదిగా మభ్యపెట్టి తమ పబ్బం గడుపుకుంటున్నారని శ్రామికవర్గం నుండి ఎదగాలనుకుంటున్న రచయితలకు ప్రోత్సాహం అందక విమర్శిస్తున్నారు. వారి ఆర్తిని అర్థం చేసుకోవాల్సి వుంది. వారు ఒక దశకు ఎదిగేసరికి మధ్యతరగతి విప్లవ అభ్యుదయ రచయితలు కవిత్వాన్ని, సాహిత్యాన్ని శిల్పంలో, అభివ్యక్తిలో శ్రామికవర్గ రచయితలు అందుకోలేని రీతిలో, అర్థం చేసుకోలేని రీతిలో మలుపులు, మార్పులు తెచ్చి నిజమైన శ్రామికవర్గ రచయితలను అది సాహిత్యం కాదని, నినాదం అని, శిల్పం లేదని నిరసిస్తున్నారు. నిరాశ పరుస్తున్నారు. అయితే ఆ మధ్యతరగతికి కూడా 30 ఏళ్ల క్రితం ఇదే పని చేసింది అని మర్చిపోతున్నారు.

పద్యం నుండి వచన కవిత్వానికి ఎందుకు పయనించారో ఆ లక్ష్యాన్ని వదిలేసి వచన కవిత్వాన్ని పద్యం కన్నా మరింత అర్థంకాని ఇమేజరీలతో నింపేస్తున్నారు. అదే కవిత్వమని పైగా శ్రామికవర్గ కవిత్వం కూడా ఇలాగే వుండాలని శాసిస్తున్నారు, సమీక్షిస్తున్నారు. సాహితి చరిత్రలో రాస్తున్నారు. నిజమైన శ్రామికవర్గం నుండి అష్టకష్టాలు పడి, పేదరికం నుండి ఎదిగి కాస్త కలం పట్టడం నేర్చుకుని రాయడం ప్రారంభించిన రచయితలను విమర్శిస్తున్నారు. ఇటీవల ఈ నిరసన ఎంత స్థాయికి పోయిందంటే పదుల కవితా సంపుటాలను ఒకేసారి సమీక్షిస్తూ అందులో కవిత్వం లేదని కించపరిచారు. వారు పుట్టి పెరిగిన పరిస్థితులను, ఎదిగిన తీరుతెన్నులను తెలుసుకోకుండా, వారిని ఎదిగించే శిక్షణా తరగతులు ఏవీ నిర్వహించకుండా అలాంటి రచయితల దగ్గరికి వెళ్లకుండా నిన్నటి రచయితలు నేటి పీఠాధిపతులుగా మాట్లాడుతున్నారు. నిన్న వారి బాల్యం కూడా ఇలాగే సాగింది అని మర్చిపోతున్నారు. వాళ్లకు మంచి ఉద్యోగాలు, మంచి అవకాశాలు, మంచి జీవనప్రమాణాలు అందడం వల్ల తీరిక, అధ్యయనం పెరిగి సాహిత్యంలో అభివృద్ధి సాధించారనేది మర్చిపోయి పేదరికంలో నిరంతరం కూడు, గుడ్డ కోసం, పని కోసం లేబర్ అడ్డాలమీద నిలబడే శ్రామికవర్గ రచయితలను ఈసడిస్తున్నారు.

ఈ దశలో ఎన్నెం సత్యం అనే శ్రామికవర్గ రచయిత నిజమైన శ్రామికవర్గ రచయితల సంఘాన్ని ఏర్పాటు చేయాలని ఇప్పుడున్న రచయితల సంఘాలు అన్నీ విద్యావంతుల, మధ్యతరగతి రచయితల వేదికలుగానే వారి ప్రయోజనాల కోసమే ఉన్నాయని గత కొంతకాలంగా చెప్తూ వస్తున్నాయి. నిజంగా అలాంటి నిజమైన శ్రామికవర్గ రచయితల సంఘం ఏర్పడ్డం ఈనాటి చారిత్రక అవసరం. నిజమైన శ్రామికవర్గం నుండి ఎదిగిన రచయిత వేముల శంకర్. వేముల శంకర్, ఎన్నెం సత్యం, జాజుల గౌరి, వొడ్నాల సూర్య మొదలైన శ్రామికవర్గ రచయితలు శ్రామికవర్గ రచయితల సంఘం ఏర్పాటుకోసం కృషి చేయాలి.

ఇవన్నీ నా భావాలేనా? కాదు. వేముల శంకర్ భావాలే ఇవి. అతనికి ఈ స్పష్టత వుంది. 'కార్మికుడు – కళాకారుడు' కవితలో 'కార్మికుణ్ణి నేను/ కష్టజీవిని నేను/ కళాకారునివి నీవు / కళా పోషకునివి నీవు / అలుపెరుగని శ్రమ శక్తి నాది / అభినయంతో ముగింపులేని / కళాజ్యోతి నీది'.../ శ్రమకు ఫలితం శూన్యం నాది / ఆ.. శూన్యం లోని ఫలితం నీది'. ఈ కవికి బతకనేర్చిన కళాకారుల పట్ల గల నిజమైన శ్రామికవర్గ రచయిత దృష్టి స్పష్టమౌతుంది.

వేముల శంకర్ ఇంటి గోడలకు రంగులు వేసే ఒక కార్మికుడు. ఒక పెయింటర్. అనేక అంతస్తుల బిల్డింగులను తాడుపై వేలాడి భవనాలకు అందాలను చేకూర్చే కళాకారుడు. పెయింటింగ్ కార్మికుల రాష్ట్ర సంఘానికి బోర్డ్ సెక్రెటరీ. పేదరికంలో పుట్టి, పేదరికంలో పెరిగి, ఎక్కువగా చదువుకోలేకపోయినా పెరిగిన చైతన్యంతో తాను పుట్టి పెరిగిన శ్రామికవర్గం గురించి తానే రాయాలని కలం పట్టిన కవి. ఒక నాయకుడిగా పెయింటర్ల జీవితాలు, కష్టసుఖాల గురించి "చరిత్రకందని కీర్తి" పేరిట ఒక వ్యాస సంపుటి ప్రచురించాడు. అటు తర్వాత ఉద్యమంలో ఎన్నో ప్రసంగాలు, నినాదాలు, పాటలు అవసరమయ్యాయి. ఆ క్రమంలో తన మాటే ఒక నినాదంగా, ఒక గేయంగా రూపుదిద్దుకోవడం గమనించాడు. మరికొందరు మిత్రుల ప్రోత్సాహంతో వాటిని కవితలుగా మలిచాడు. అలా రూపొందినవే ఇందులోని కవితలు. ఒక సామాజిక ఆచరణలో భాగంగా, ఒక ఉద్యమంలో భాగంగా రూపుదిద్దుకున్న కవితలివి. అందుకే ఇందులో నాదం, దయాత్మకత, నినాద స్థాయి కవిత్వం కనపడుతుంది. చెరబండ రాజు విప్లవ కవిత్వం కూడా ఇలాగే గేయానికి అనుకూలంగా వుంటుంది.

గురజాడ, జాషువా, కరుణశ్రీ, కృష్ణశాస్త్రి, శ్రీ శ్రీ ల్లోని ధ్వని, లయాత్మకత, శబ్దమాధుర్యం దశాబ్దాలుగా పాటలోనూ, కవితల్లోనూ అందర్నీ ఆకర్శిస్తూనే వుంది. సినిమా పాటల్లోనూ దీన్ని గమనించవచ్చు. అందుకే ప్రజలు లయాత్మకత, శబ్దమాధుర్యం, నేపథ్య సంగీతం వల్ల సినిమా పాటలను జీవితంలో భాగం చేసుకున్నారు.

వచన కవుల కవిత్వం గురించి సాహిత్యంలో వాళ్ళ ఆధిపత్యవాదులుగా అందరినీ అణిచివేస్తున్న తీరు గురించి సీరియస్‌గా చర్చించే చారిత్రక సందర్భం ఆసన్నమైందని ఎన్నెం సత్యం, వేముల శంకర్ వంటి కవులు పదుల కొద్దీ కవితా సంపుటాలను ఎద్దేవా చేసిన తీరు, కవులు నిరక్షరాస్యులా అంటూ జానపద, శ్రామికవర్గ కవులు తమ జీవితానుభవాలను, స్పందనలను, భావాలను వ్యక్తం చేసుకునే హక్కే లేదన్నట్టు ప్రవర్తిస్తున్న కొందరు కవిరూప సమీక్షకుల తీరు స్పష్టం చేస్తున్నది.

వేముల శంకర్, ఎన్నెం సత్యం వంటి వాళ్ళు నేడు కవిత్వానికి ఇస్తున్న నిర్వచనాలను, ప్రమాణాలను, గీటురాళ్లను మార్చాలని కోరుకుంటున్నారు. జానపద కవుల వలె శ్రామికవర్గ కవులను గౌరవించాలని సామాజిక రంగంలో వారి కవిత్వం ఇస్తున్న స్ఫూర్తిని, ఉత్తేజాన్ని గుర్తించాలని ఏ కవిత్వానికైనా ఇంతకన్నా కావాల్సిందేముందని ప్రశ్నిస్తున్నారు.

గురజాడ దేశభక్తి గేయం, చెరబండ రాజు కొండలు పగలేసిన వంటి గేయాలు ఇవాళ వచన కవులకు కవిత్వం కాకుండా పోయాయి. వచన కవులు చివరికి ప్రజలకు అభివ్యక్తి రాదనేంత సాహసానికి ఒడిగడ్తున్నారు. ఈ కుహనా ప్రమాణాలను బద్దలు కొట్టవలసిందే. వచన కవిత్వంలో ఉన్న ఇమేజరీ, గాఢత కవిత్వ చరిత్రలో భాగం కాదని, కవిత్వ శిల్పపరిణామ చరిత్రలో భాగమని చాలామంది వచన కవులకు తెలియదు.

సాహిత్య చరిత్ర విశాలమైనది. అందులో సాహిత్య శిల్ప పరిణామ చరిత్ర ఒక అంశం మాత్రమే. చాలామంది గొప్ప వచన కవులం, గొప్ప వచన కవిత్వం రాశాం అని అనుకుంటూ ఆత్మానందం పొందేవారంతా రాసింది సాహిత్య చరిత్రలో భాగం కాదని సాహిత్య వస్తు శిల్పాల పరిణామాల చరిత్రలో మాత్రమే భాగమని వారికి తెలియని అమాయకత్వంతో ఒక రకమైన కీర్తి మత్తులో జోగాడుతున్నారు. సాహిత్య చరిత్ర సామాజిక చరిత్రలో భాగం.

సామాజిక చరిత్రను ప్రభావితం చేసేది, నిర్మించేది, చిత్రించేది సాహిత్య చరిత్రలో భాగమవుతుంది. మిగతాది సాహిత్య వస్తు శిల్ప పరిణామ చరిత్రలో భాగమవుతుంది. లేదా సాహితీ వేత్తల చరిత్రలో భాగమవుతుంది. సాహిత్య చరిత్ర భావకవిత్వం, అభ్యుదయ కవిత్వం, హేతువాద కవిత్వం, విప్లవ కవిత్వం, స్త్రీవాద కవిత్వం, దళిత వాద కవిత్వం, బీసీ వాద కవిత్వం, మైనారిటీ కవిత్వం, శిశువాద కవిత్వం, గ్లోబలైజేషన్ పరిణామాల వ్యతిరేక కవిత్వం మొదలైన శీర్షికలతో రాయబడుతుంది.

అంతేగానీ ఒక కవి యొక్క సాహిత్య వస్తు శిల్ప పరిణామాల ననుసరించి రాయబడదు. మొత్తం సామాజిక పరిణామాల, ఉద్యమాల ననుసరించి అదేవరసలో సాహిత్య చరిత్ర కూడా రాయబడుతుంది. ఈ విషయం కవులకు, ముఖ్యంగా వచన కవులకు అర్థం కావడం అవసరం. అప్పుడే వాళ్ళ అనవసరమైన మేధోశ్రమ నుండి బయటపడి ఇంతకు పదిరేట్లు ప్రజల జీవితాన్ని చిత్రించే సులువైన, సరళమైన అభివ్యక్తిని, శైలీ శిల్పాలను సాధించుకుంటారు. అందుకు వచన కవిత్వంలో అపూర్వమనదగిన ముద్రవేసిన అలిశెట్టి ప్రభాకర్ కవితారీతి ఒక ఆదర్శంగా అధ్యయనం చేయవచ్చు. ఆయన పదాల్లో, పాదాల్లో అర్థం కానిదంటూ ఏమీ వుండదు. అయినా గొప్ప కవిత్వంగా ఎవరూ చెప్పకుండానే పాఠకుడు ఫీల్ అవుతాడు. అదీ ఈనాడు వచన కవులు అభ్యసించాల్సిన విద్య. అలాంటి గొప్ప కవులు తెలుగులో నేడు లేకపోలేదు.

'బతుకు బాటలో...' అనే ఈ కవితా సంపుటిలో 36 కవితలున్నాయి. ఇందులో అర్థంకాని కవితలంటూ ఏవీ లేదు. పిల్లలు కూడా అర్థం చేసుకునే సార్వజనీన భావాలను ఈ కవిత్వంలో చూడవచ్చు. పాఠ్యపుస్తకాల్లో చేర్చడానికి, బాలసాహిత్యంలో చేర్చడానికి కూడా అనువైన కవితలు ఇందులో ఎన్నో వున్నాయి. గ్రామీణ విద్యార్థులకు మిగతా సమాజం ఎలా వుందో తెలుసుకోవడానికి ఉపకరిస్తాయి.

వేముల శంకరక కవితలో లయాత్మకత, శబ్ద మాధుర్యం ఎంత అలవోకగా వుంటుందో చూడండి. 'బతుకుబాటలో...' అనే కవితలో 'జీవన చిత్రగతిలో / చితికిన బతుకులలో / చిరిగిన వలువలలో / మెతుకు వెతుకులాటలో / కార్మికులెందరో / కర్షకులెందరో... పరిచితులెందరో / అపరిచితులెందరో / ఆశావాదులెందరో / నిరాశావాదులెందరో / ఫుట్‌పాత్‌మీద బతికే / బిచ్చగాళ్లెందరో...' అంటూ వారి జీవితమంతా 'జీవనయానంలో / క్షణక్షణం వేదనే / అనుక్షణం ఆవేదనే' అంటూ తాను ఏ ప్రజలవైపు వున్నాడో స్పష్టం చేస్తున్నాడు.

అలాగే 'శ్రమజీవులం' కవితలో 'బతుకుబాటలో / మెతుకు వేటలో / నిత్య ప్రయాసతో' అనే అభివ్యక్తి గొప్ప లయాత్మకతను, భావాన్ని, ప్రాచీన, ఆధునిక సాహిత్య అలంకార శాస్త్రాలను అన్వయించినట్టుగా వుంది. 'గమనంలేని జీవనంలా, చలనంలేని దృశ్యంగా మారినవాళ్ళు' శ్రమజీవులంటారు. పేదలవి జీవితంలో ముందడుగు వేసే అవకాశమే లేని నిశ్చల జీవితాలు అని చెప్పడానికి కవి ఎంతో అలవోకగా గొప్ప అభివ్యక్తిని సాధించాడో చూస్తే ఆశ్చర్యమేస్తుంది. అయితే అక్కడితో చెప్పి కరుణరసాన్ని సృష్టించి ఊరుకోడు. 'శ్రామికవర్గమంతా / సమాజ నిర్మాతలే' అని చైతన్యాన్ని కూడా అందిస్తాడు.

తన భావాలను కవిత్వంగా మలిచాడు. ఈ కవితల్లోని కొన్ని వస్తువులు ఈ కవికే ప్రత్యేకం. ఇప్పటిదాకా వచన కవులు ఎవరూ తీసుకోని కవితా వస్తువులు ఇందులో ఎన్నో వున్నాయి. సినిమాల్లో అలాంటి జీవితాల గురించి ఎన్నో సన్నివేశాలు,

పాత్రలు వచ్చేశాయి. అయినా వచన కవుల కవితల్లో వారికి చోటు చాలా తక్కువ. ఉదాహరణకు కందకం తీసే కార్మికుల గురించి, ఆటో కార్మికుల గురించి, గోడకు రంగులు వేసే పెయింటర్ల గురించి ప్రజాపక్షం వహించే కవులు ఎందరు రాశారు? ఇలా వీరి గురించి రాసే అవకాశాన్ని వేముల శంకర్‌కి వాళ్లిచ్చారు. అందుకు వేముల శంకర్ వారికి ధన్యవాదాలు చెప్పుకోవాలి.

ఇందులోని చక్కని వ్యక్తీకరణ, భావస్పష్టత గల కొన్ని కవితలను చూడండి. 'పూరిగుడిసెలో నివాసం / పూట గడిస్తే ఉపశమనం...' 'సప్త వర్ణాలనే / సహస్రవర్ణాల సమ్మేళనంగా'... 'నిత్యం సమర సారథులుగా / సాగిస్తున్నాం జీవిత రథాన్ని...'

'మెకానిక్' కవితలో 'సైకిల్ నుండి విమానం వరకు /కత్తి నుండి కంప్యూటర్ వరకు / బీగం నుండి బీరువా వరకు'... 'మరమనిషిలా / మరయంత్రంలోకి / పరకాయ ప్రవేశం చేస్తాడు / ఆటో గ్యారేజిలోనే / నివాసముంటాడు'... ఒక గొప్ప భావాన్ని మెకానిక్‌ల పట్ల గౌరవాన్ని కలిగిస్తుంది ఈ కవిత.

కులమతాల అడ్డుగోడల గురించి రచయితకు స్పష్టత వుంది. కులమతాలు అడ్డుగోడలే అంటూ 'జీవితపథంలో / జీవితమే సత్యం / మన కులం మానవకులం / మన మతం మానవత్వం...' అని స్పష్టం చేస్తాడు. 'ఆటో రిక్షా' కవితలో, 'ఆటో చక్రమే సంసారచక్రమైంది'.. అనడంలో ఒక చక్కని భావం స్ఫూరిస్తుంది. అలాగే విమర్శకుడి గురించి 'కాలగమనానికి దిక్సూచి / తారతమ్యాలను తెలిపే దూరదర్శి / ప్రగతి బాటకు మార్గదర్శి' అని ప్రశంసిస్తాడు.

ఈ కవితా సంపుటిలో అవగాహన పెరగని భావాలు కొన్ని లేకపోలేదు. కాలక్రమంలో ఎదుగుతాడు అని ఈ కవితా సంపుటి నమ్మకం కలిగిస్తుంది. ముఖ్యంగా వేముల శంకర్ కవిగా, కార్మిక వర్గ నాయకుడిగా తనకు తెలిసిన జీవితాలను మానవీయ అంశాల కోణంలో చిత్రించే నేర్పును అభ్యసించాలి. జీవితంలోని సంఘటనలను, సన్నివేశాలను, ఎపిసోడ్, ఎపిసోడ్‌లుగా, ఫోటోలు ఫోటోలుగా చిత్రించడం నేర్చుకోవాలి. డా॥ ఎన్. గోపి, అలిశెట్టి ప్రభాకర్, జూకంటి జగన్నాథం, ఎండ్లూరి సుధాకర్, జాజుల గౌరి, వొడ్నాల సూర్య, గద్దర్, వంగపండు, గూడ అంజయ్య, గోరటి వెంకన్న, అన్నవరం దేవేందర్ మొదలైన జీవితాన్ని, అందులోని సన్నివేశాలను చిత్రించే కవుల రచనలను పరిశీలిస్తే ఈ కవి ఎదగడం అంత కష్టమేమీ కాదు అని ఈ కవితలు స్పష్టం చేస్తున్నాయి.

నిజమైన శ్రామిక వర్గాలనుండి ఎదుగుతున్న వేముల శంకర్ వంటి రచయితలను ప్రత్యేక దృష్టితో విలువైన ముడివజ్రాలు దొరికినట్టుగా సంతోషించి వాటిని సానపట్టే కృషి చేస్తూ వారికి ప్రోత్సాహాన్ని అందించడం సాహిత్య అభిమానుల కర్తవ్యం.

# "శ్రమశక్తికి నివాళులెత్తిన కవితలు"

రంగులు వేయడాన్ని వృత్తిగా చేసుకొని బతుకుతున్న శంకర్‌కు సాహిత్యం పట్ల గొప్ప ఆసక్తి అంకిత భావం ఉన్నాయి. ఇళ్ళకు రంగులు వేసే తనతోటి పెయింటర్ల గురించి ఇంతకు ముందు మంచి పుస్తకం **"చరిత్ర కందని కీర్తి"** (పెయింటర్ల జీవిత గాథలు) రచించాడు. ఇప్పుడు తనతోటి శ్రామికుల శ్రమశక్తిని కీర్తిస్తూ రచించిన కవితల్ని **"బతుకు బాటలో"** అన్న కవితా సంకలనంగా వెలువరిస్తున్నాడు.

పెయింటింగ్ వృత్తిలో ఉన్న శంకర్‌కు కవిత్వం రాయాలన్న అభినివేశం ఉండడం నన్ను సంభ్రమాశ్చర్యాలకు గురి చేసింది. ఈ వృత్తిలో ఉన్నవాళ్లకు క్షణం కూడా తీరిక లభించదు. కవిత్వాన్ని చదివే అవకాశం గానీ, తమ బుర్రల్లో మెదిలే ఎన్నో ఆలోచనలకు అక్షరరూపం ఇవ్వగలిగే సామర్థ్యం గానీ, వీళ్లలో చాలా అరుదుగా ఉంటుంది. అలాంటి అరుదైన వ్యక్తిత్వం కలిగినవాడు మన ఈ శంకర్.

శంకర్ వ్యాసాలను మాత్రమే కాదు కవితల్ని కూడా రచించగలడని అతని ఈ రెండవ పుస్తకం చదివాక నాకర్థమైంది.

ఒకప్పుడు సాహిత్యం సమాజంలోని ఉన్నత వర్గాలకు మాత్రమే పరిమితమై ఉండేది. వ్రాసే వాళ్ళయినా చదివే వాళ్ళయినా, ఉన్నత వర్గాలకే చెందినవారై ఉండేవాళ్ళు. అందువల్ల ఉన్నత వర్గాల వారి జీవితం సాహిత్యంలో నిక్షిప్తమయ్యేది కానీ ఇవ్వాళ ఆ పరిస్థితి మారింది అట్టడుగు వర్గాల ప్రజలు కూడా సాహిత్యాన్ని సృష్టిస్తున్నారు. సాహిత్యాన్ని చదువుతున్నారు. పెయింటింగ్ వృత్తిలో స్థిరపడిన శంకర్ కవిగా మన ముందుకొస్తున్నాడంటే సాహిత్యం సమాజంలోని అన్ని వర్గాల వారి కందరికి ఎలా అందుబాటులోకి వచ్చిందో మనకర్థమవుతుంది.

శంకర్ వెలువరిస్తున్న ఈ "బతుకు బాటలో" అన్న కవితా సంకలనంలో మొత్తం 36 కవితలున్నాయి. వీటిలోని చాలా కవితల్లో శంకర్ శ్రమజీవుల గురించే ఎక్కువగా వ్రాశాడు. శ్రమశక్తి ఎంత ఉన్నతమైందో ఒక ఆర్థిక వ్యవస్థలో జరిగే సమస్త వస్తు సేవల ఉత్పత్తికి శ్రమ ఎలా మూల కారణమవుతుందో శంకర్ చెప్పాడు.

జీవన చిత్రగతిలో / చితికిన బతుకులలో
చిరిగిన వలువలలో / మెతుకు వెతుకులాటలో
కార్మికులెందరో / కర్షకులెందరో అంటాడు

"బతుకుబాటలో" అనే కవితా సంకలనంలో శ్రమజీవులం / శ్రమించే శ్రామికులం / బతుకు బాటలో / మెతుకు వేటలో నిత్య ప్రయాసతో దినం గడిస్తే చాలంటాం జనం హర్షిస్తే మేలంటాం అంటాడీ కవి.

"శ్రమజీవులం" అన్న ఈ సంపుటిలోని మరో కవితలో కూడా
కోటికి పడగలెత్తాలనే ఆశలేని వాళ్ళం
కర్ణునిలా దానం చేయాలనే తాపత్రయం లేనివాళ్లం
అర్జునిలా విజయం సాధించాలనే తపన లేనివాళ్లం కానీ....
కొండలనైనా పిండి చేయగల సత్తా ఉన్నవాళ్లం అంటూ
శంకర్ శ్రమశక్తికి నివాళులెత్తుతాడు.

మేఘాలు వర్షించి నేల తల్లి పులకరించి
చిగురించిన పంట చేతికందితే కర్షకుడు హర్షిస్తాడు
కర్షక వృత్తినే కాంక్షిస్తాడు అంటూ.....
వ్యవసాయదారుల గుర్చి గొప్ప ఆర్తితో, సానుభూతితో చెబుతాడు.

సమాజంలో మధ్య దళారులు చేరి అనేక అక్రమాలకు, అన్యాయాలకు ఎలా పాల్పడుతారో 'మధ్యవర్తి' అనే కవితా శీర్షికలో
ఇద్దరి వ్యక్తుల మధ్య
వాద వివాదాలకు
అతడే పరిష్కర్త అంటూ.....
సమాజం మీదపడి బతికే లంపెన్ వర్గాలను గూర్చి మధ్యదళారులను నిష్కర్షగా వ్రాశాడు.

శంకర్ కవితలో వాడి-వేడీ ఉన్నాయి. అన్యాయం పట్ల, అక్రమాల పట్ల ధర్మాగ్రహం ఉంది. శ్రామికుల పట్ల అపరిమితమైన సానుభూతి ఉంది.

కవిత్వమంటే అందమైన పద విన్యాసం అద్భుతమైన అలంకారాలు మాత్రమే అనుకునే సాహితీ వేత్తలకు శంకర్ కవిత్వంలో అవి సరిపోయేంతగా లేవేమోనని అనిపించవచ్చు తను వ్రాసిన కవితలకు గంటల తరబడి నగిషీలు చెక్కి పండితుల చేత ఆహా! ఓహో ! అనుపించుకోవడం కూడా శంకర్‌కు చేతకాకపోవచ్చు. ఆయన కవితలో చాలా కవితలు నగిషీలు చెక్కబడని ముడిసరుకులుగా కనిపించవచ్చు కానీ, శంకర్ ఓ శ్రామికుడుగా కవితల్ని వ్రాయాలన్న కోరిక కల్గడమే చాలా గొప్ప విషయం. తనలో మెదిలిన భావాలను అతడు కవిత్వీకరించి చేసిన ప్రయత్నం బావుంది. ఇంకా ఈ రంగంలో కృషి చేస్తే భవిష్యత్తులో ఇంకెన్నో కవితల్ని రచించాలన్న నమ్మకాన్ని ఈ సంకలనంలోని కవితలు కల్గిస్తున్నాయి.

**డా॥ అంపశయ్య నవీన్**
వరంగల్
కేంద్ర సాహిత్య అకాడమీ
అవార్డు గ్రహీత

# "శ్రమ మూలం యిదం జగత్"

"శ్రమైక జీవన సౌందర్యానికి సమానమైంది లేనే లేదన్నాడు" శ్రీశ్రీ నిజమే జీవితం తృప్తిగా సాగుతూ ఉండాలంటే దానికి మూలం శ్రమయే. ధన ధన్యాదులు, సిరిసంపదలు, శాంతి సౌఖ్యాలు మానసికోల్లాసాన్ని శ్రమశక్తి పైనే ఆధారపడియున్నాయి. "ధనం మూలం - యిదం జగత్" అన్న ఆర్యోక్తి కూడా శ్రమ మూలం యిదం జగత్" అంటే బాగుంటుందేమో...

శ్రమతో ధనాన్ని సంతరించవచ్చు, సుఖ జీవనాన్ని సాగించవచ్చు.

ఈ శ్రమశక్తి కళాత్మకమైతే మానసికానందంతో పాటు సమాజంలో గౌరవ ప్రతిష్టలు కలుగుతాయి.

చతుషష్టి కళల్లో లలిత కళలు ఆరు - సంగీతం, సాహిత్యం, నాట్యం, చిత్ర-శిల్ప కళలు. ఈ ఆరు సృజనాత్మకమైన శ్రమశక్తికి సంపన్నములే.

కళకు-కళాకారులకు అవినాభావ సంబంధం. అందులో ముఖ్యంగా సృజనాత్మకమైన కళ చిత్రకళ రూపురేఖలు రంగులు అద్దుకొంటే యిక ఆ కళ అందచందాలు సిరివెన్నెలే అవుతుంది. వారు వేసిన కళా సౌందర్యం మనోవికాసాన్ని సూచిస్తే మనో భావాల్ని అక్షరబద్ధం చేసే కళయే సాహిత్యం.

సాహిత్యమైనా, చిత్రకళ అయినా తమంత తామే మనస్సునుండి ఉద్భవించినవే.

అట్టి సౌందర్య కళల్ని అక్షర బద్ధం చేస్తూ సాహిత్యాన్ని సృష్టించే కవుల్లో శ్రీ వేముల శంకర్ ఒకరు.

ఆ కళల్ని పోషించే కళాకారుల శ్రమశక్తి ఎంతో గొప్పది అయితే అట్టి కళాపిపాసనకై వెచ్చించే శ్రమ జీవుల జీవన విధానాన్ని వారి స్థితి గతులను కవిత్వ బద్ధం చేసిన శంకర్ అభినందనీయుడు.

కళల్ని చూసి మురిసిపోవడం కాదు. ఆ కళాకారుల్ని గూర్చి ఆలోచించండి! బతుకు బాటలో వేము శ్రమజీవులమంటూ మమ్మల్ని ఆదరించాలంటూ, ఆదుకోవాలంటూ అర్థించే భావ కవితలు యిందులో చోటు చేసుకున్నాయి.

శంకర్ అందిస్తున్న "బతుకు బాటలో" అనే కవితా సంపుటిలో జీవన చిత్రగతిలో - చితికి బతుకులలో - మెతుకు వెతుకులాటలో కార్మిక కర్షకులు -

నిరాశావాదులు ఎందో పయనిస్తున్నారు.... అయినా

నవ్య ప్రపంచానికి బాటలు వేసే భావి నిర్మాతలేనంటాడు కొండలనైనా పిండి చేయగల సత్తా ఉన్నవాళ్లంటాడు.

'కులం - మతం' శీర్షికలో కులమతాల అడ్డుగోడలే భావి తరాన్ని వేరు చేస్తాయి అన్నది సత్యం.

బతుకు బాటలో అటో చక్రమే సంసార చక్రమైంది. సంపాదన చక్రమే శూన్యమవుతున్నది అంటూ ఆటో కార్మికుల బాధలను తెలిపాడు.

దోపిడికి గురి అయితే అప్పుల బాదలే మిగులుతాయి. ఆత్మహత్యలే జరుగుతాయనడం - నేటి దోపిడీ కారుల స్థితిగతులకు కారణమవుతుంది.

ఇలా అనేక సామాజిక స్థితిగతులు - శ్రామికుల బతుకు బాటలో ఏ విధంగా ప్రభావితమవుతున్నాయో - తెలిపే చక్కని భావ కవితలు యిందులో చోటు చేసుకున్నాయి.

అనుభవైక వేద్యమౌ శ్రామిక కళాకారుడైన వేముల శంకర్ కలం నుండి కుంచెలు కుంచెలుగా నవ్య కవితాధారలు పుస్తక రూపంలో రూపుదిద్దుకోవాలని, ఇవి సమాజానికి అద్దంలో ప్రతిబింబించాలని ఆకాంక్షిస్తూ....


**డా॥ సి.వి. జయవీరరాజ్**

వరంగల్

**కవితిలక బిరుదాంకితులు**

**తెలుగు అసోసియేట్ ప్రొఫెసర్**


# "బతుకే కవిత్వంలో నడుస్తున్న శంకర్"

"తన చరిత్రనే రాసుకుంటుంది ధరిత్రి" అన్నట్లు తన జీవితాన్ని తను అనుభవిస్తున్న శ్రమనీ, తను కవిత్వీకరించుకుంటున్నట్టుగా వుంది శ్రీ వేముల శంకర్ పుస్తకం చదువుతుంటే....

"శ్రమజీవుల రుధిర బిందువులే
ఘర్మకడలిలో ఘనీభవించుచున్నవి
బతుకు కడలిలో అశ్రుబిందువులే
కెరటాలుగా ఎగిసిపడుతూ ఆవిరవుతున్నవి

ఈ కవిత చదువుతుంటే శంకర్‌లో ఇంత భాషఘోష నిక్షిప్తమై వున్నదా అని తలుచుకొని గర్వించాను.

భాషా భావం ఇవ్వాళ కొందరికే తెలిసిన బ్రహ్మవిద్యకాదు. సామాన్య మానవుల సొత్తుగా మారింది. అది నాకెంతో ముచ్చటగా ఉంది.

చెమట నదిలో తడుస్తూ, చెమట ప్రపంచంలో జీవిస్తూ చెమట చుక్కలను అక్షర శిల్పాలుగా చెక్కుతున్న కార్మిక అభ్యుదయ కవిగా శంకర్‌ను నేను అభినందిస్తున్నాను.

చలాన్ని 'మీరు ఎందుకు రాస్తున్నారూ' అంటే 'రాయక ఉండలేక' అని జవాబిచ్చాడు. అలా రాయకుండా ఉండలేని భావావేశపుటొత్తిడి శంకర్‌లోని సృజనకు ప్రాణం పోసింది.

రాయడం అలవాటు చేసుకుంటున్న శంకర్ విప్లవాత్మకంగా వస్తున్న నేటి కవితా ప్రబంజనాన్ని అధ్యయనం చేస్తూ తనదైన శైలిలో ముందుకు సాగాలని కోరుకుంటున్నాను.


**సుద్దాల అశోక్‌తేజ**

హైదరాబాద్

జాతీయ అవార్డు సినీ గేయ రచయిత

# "నా మాట"

మనిషి ఎప్పుడూ ఆశాజీవే. తన చుట్టూ ధనమే తిరుగుతుందని భ్రమపడుతూ, మానవ సంబంధాలనే దూరం చేసుకుంటూ స్వార్థబుద్ధితో 'ధనాన్వేషణ'లో స్వర్గానికే నిచ్చెనలు వేయాలని ఆరాటపడుతూ ధనమే ఇంధనమని ఆత్మనే అమ్ముకుంటూ అవసరం కోసం అవకాశం కోసం ఎదిగే ప్రయత్నంలో శరీరాన్ని హీన స్థితికి దిగజార్చుకుంటూ, బి.పి., షుగర్ మొదలగు రోగాలను కొని తెచ్చుకుంటూ, చివరికి కూడ బెట్టుకున్న ధనమే 'పరులపాలు' అవుతుందని తెలుసుకోలేక అవసాన దశలో ఒంటరివాడుగా మిగిలిపోయే స్వార్థపరులెందరో తమ తలరాతను తామే మార్చుకుంటున్నారు.

స్వార్థం అన్ని వేళలా పనికిరాదన్న నగ్నసత్యాన్ని గుర్తించి ఇదే గుణపాఠమనుకొని, స్వార్థాన్ని రవ్వంత విడనాడితే, బతుకు కొరకు తపించిన, మెతుకు కొరకు తపించిన, వృత్తి మారినా, ప్రవృత్తి చేపట్టిన, చేసే ప్రతి పనిలో నైతిక విలువలుంటాయని, అంతరాత్మనే నమ్ముకొని బతుకుతున్న నిస్వార్థపరులకు తమ కీర్తి చరిత్రకు అందకున్నా, ధరిత్రిలో మాత్రం తమ శ్రమశక్తి చెరిగిపోదు - తరిగిపోదు ఇది వాస్తవం.

'బతుకు బాటలో' నిరంతరం సమాజ శ్రేయస్సుకై శ్రమించే శ్రమజీవులందరికి, గమ్యం తెలియని బాటసారులందరికి ఈ 'కవితా సంకలనాన్ని' అంకితం చేస్తూ.....

బతుకు బాటలో కవితా సంకలనానికి తమ అమూల్యమైన అభిప్రాయాలను అందించిన 'కవితిలక' బిరుదాంకితులు, రాష్ట్ర ఉత్తమ అధ్యాపక అవార్డు గ్రహీత సి.వి. జయవీరరాజు గారికి.....

అలాగే కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత అంపశయ్య నవీన్ గారికి....

కార్మిక అభ్యుదయ కవిగా ఎదగాలని ప్రశంసించి తమ అభిప్రాయాలను తెలిపిన సినీకవి శ్రీ సుద్దాల అశోక్ తేజ గారికి....

"బతుకు తపనలో మెతుకు కొరకు తపించే శ్రమజీవులకు బతుకు బాటలో తప్పుదు బతుకుపోరు" అంటూ తమ అభిప్రాయాలను "ముందుమాట" గా వ్రాసి యిచ్చిన సామాజిక తత్వవేత్త విశాల సాహిత్య అకాడమీ వ్యవస్థాపకులు బి.ఎస్. రాములు గారికి....

ఈ ప్రచురణకు ఆర్థిక సహాయం అందించిన శ్రీ పొట్టి శ్రీరాములు విశ్వవిద్యాలయం వారికి..... పుస్తక ప్రచురణ విశాల సాహితీ సంస్థ వారికి.... మరియు సాహిత్యాభిమానులైన శ్రీ ముప్పా మల్లేశం (పి.డి.) గారికి.... శ్రీ నలిగంటి చంద్రమౌళి గారికి .... ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను.

**వేముల శంకర్**
-రచయిత-

## విషయ సూచిక

## 1. బతుకు బాటలో

జీవన చిత్రగతిలో
చితికిన బతుకులలో
చిరిగిన వలువలలో
మెతుకు వెతుకులాటలో
కార్మికులెందరో
కర్షకులెందరో
పరిచితులెందరో
అపరిచితులెందరో
ఆశావాదులెందరో
నిరాశావాదులెందరో
ఫుట్‌పాత్‌మీద బతికే
బిచ్చగాళ్లెందరో

పూట పూట పస్తులుండె
చిన్నారులెందరో
క్షణక్షణం వేదనే
అనుక్షణం ఆవేదనే

సామాజిక జీవనంతో ఆరాటం
యాంత్రిక సాదనంతో పోరాటం
సప్త వ్యసనాలతో చెలగాటం
బాటసారులెందరైన
బతుకుబాట అదేగదా . . . .

జీవన ప్రస్థానంలో
ఆకలితో అలమటించిన
తుది మజిలీ నిరీక్షణ కోసం
అపశృతి దొర్లితే
మనసు తల్లడిల్లుతుంది
బతుకుబండి భారమౌతుంది
బతుకే చిత్తుకాగితమవుతుంది

ఆర్ధ్రత నిండిన ఎదలో కన్నీటి కథలు
వెతలుగా మిగులుతాయి
జీవన యానంలో
క్షణక్షణం వేదనే
అనుక్షణం ఆవేదనే



## 2. శ్రమ జీవులం

శ్రమజీవులం
శ్రమించే శ్రామికులం
బతుకు బాటలో
మెతుకు వేటలో
నిత్య ప్రయాసతో
పడిగాపుల పస్తులుండి
దినం గడిస్తే చాలంటాం
జనం హర్షిస్తే మేలంటాం

గమనం లేని జీవనంలా
చలనం లేని దృశ్యంగా
మారినవాళ్ళం
వెలుతురులేని వేకువల్లాంటి
త్రిశంకు స్వర్గంలో
మ్రగ్గిన వాళ్ళం
అయినా..
చరిత్ర కలిగిన శ్రమజీవులం
చరిత్రనే మార్చగల శ్రామికులం

బతుకు కొరకై మెతుకు
మెతుకులోనే వెతుకు
ఆ.. వెతుకులోనే బతుకే
అర్థం తెలిసిన వాళ్ళం
జీవన రేఖకు ఎగువన ఉన్నా
దిగువన ఉన్నా
శ్రామిక వర్గమంతా
సమాజ నిర్మాతలే
శ్రమైక జీవన రంగంలో
సౌందర్య రూపాలే

స్వార్ధ రహితంగా
అంకిత భావంతో
నవ్య ప్రపంచానికి బాటలు వేసే
భావి నిర్మాతలే
మరో ప్రపంచానికి
పునాదులు వేసే ధన్యజీవులే



## 3. కందకం తీసే కార్మికులం

కందకం తీసే కార్మికులం
కష్టాన్ని నమ్మే బతుకులం
పూరిగుడిసెలో నివాసం
పూట గడిస్తే ఉపశమనం

అంతస్థులెన్నైన
అంతరాలెన్నైన
పునాదిలేనిదే భవనాలు నిలువవు
ఆ భవనాలకు పునాదులు తీసే
సూత్రదారులం...
భవన నిర్మాతలకు పాత్రదారులం

కోటికి పడగలెత్తాలనే ఆశలేనివాళ్లం
కర్ణునిలా దానం చేయాలనే
తాపత్రయం లేనివాళ్లం
అర్జునిలా విజయం సాధించాలనే
తపన లేనివాళ్ళం కానీ.....
కొండలనైన పిండి చేయగల సత్తా ఉన్నవాళ్లం

గొప్పలు చెప్పడం
తిప్పలు పడడం
తిప్పలు పడుతూ
గొప్పలు చెప్పడం తెలియదు
మెతుకు తపనలో బతుకుకు
మెరుగులు దిద్దుతున్న కార్మికులం

మహిలోనే మహిమ ఉందని
తృప్తి పడడం తప్ప
ఆలోచించుకోవడం తెలియదు
జీవిత పదసోపానానికి
శ్రమే తొలిమెట్టని తెలిసిన
వైకుంఠపాళిలో చిక్కుకున్న వాళ్లం
చిక్కుముడులు విప్పుకుంటూ
బతుకు దారిని
వెదుక్కుంటున్న వాళ్లం



## 4. చిత్ర కారులం

హృదయంలో పొంగిన
భావ స్పందనలతో కుంచెలు
అంచెలంచెలుగా ఎదిగి
చేతిలో కదిలితే
ఊహించిన రూపం
దృశ్యంగా మారుతుంది
సప్త వర్ణాలనే
సహస్రవర్ణాల సమ్మేళనంగా

రేపటి రూప దృశ్య నిర్మాణన్నే సృష్టిస్తున్నాం
ప్రకృతి అందాల సాక్షిగా. . . .
పరువశించే చిత్రకారులమై
కళాత్మక నైపుణ్యంతో
సృజనాత్మక విలువలతో
చిత్ర విచిత్ర హావ భావాలను
జీవ కళా చిత్రాలుగా
జీవిత చక్రంలోనే బందిస్తున్నాం

చిత్రకళా జగత్తులో
భావి చరిత్రకు సృష్టికర్తలుగా
జగమంతా రంగుల మయం చేస్తూ
జగతికే వన్నె తెస్తున్న చిత్రకారులం
నిత్యం సమర సారధులుగా
సాగిస్తున్నాం జీవిత రథాన్ని



## 5. కార్మికుడు - కళాకారుడు

కార్మికున్ని నేను
కష్టజీవిని నేను
కళాకారునివి నీవు
కళా పోషకునివి నీవు
అలుపెరుగని శ్రమ శక్తి నాది
అభినయంతో ముగింపులేని
కళాజ్యోతి నీది

శ్రమకు ఫలితం శూన్యం నాది
ఆ... శూన్యంలోని ఫలితం నీది
వర్తమానంలో
ఆర్తనాధంలో
జీవన భృతికై పోరాటం నాది
భావితరంలో
చతుషష్టికళల్లో
జీవ కళా భృతికై
ఆరాటం నీది

ఈ ఆరాట పోరాటంలో
బతుకే ఒక సమస్యల హారం నాది
సాహిత్యంలో
సన్మాన సభల్లో
విరబూసిన మల్లెల హారం నీది
అయినా ....

ప్రపంచ కార్మికున్ని నేను.....
ప్రపంచ కళాకారునివి నీవు.....
శ్రమ జీవులమే అయినా...
గూడులేని బతుకులు మనవి
గుర్తింపు లేని వెతలు మనవి
నేను
నువ్వు
నువ్వు
నేను కలిసి
మన శక్తి యుక్తుల్ని
చరిత్రకు ధారపోస్తాం
ధరిత్రిలో పేరుతెస్తాం



## 6. కబోదులు

చెట్టూ పుట్టా
ఊరూ వాడా
తిరిగి తిరిగి యాచించిన
ఊహలే ఎరుగరు
ఊసులే ఎత్తరు

దోపిడీ మోసంతో
నిండిన జగత్తులో
నిలువ నీడ లేక
నిస్సాహయులైన
అమాయకులుగా
కదలికలతో కర్తవ్యాన్ని గుర్తిస్తారు
మనసుతో లోకాన్ని చూస్తారు
మమతతో లాలిస్తారు

గంపెడంత ఆశ ఉన్న
గుప్పెడంత వెలుగుకోసం
కడుపంతా మాడ్చుకుని
జీవితమంతా పరుగులు తీస్తారు

బతుకు బాటలో
చిక్కుముడులను విప్పుకుంటూ
చిరునవ్వుతో పలుకరిస్తారు
చిరుదివ్వెలను వెలిగిస్తారు

లోకంలో కళంకితం లేకుండా
శోకంలో పట్టెడన్నం కోసం
పగలు రేయి యాచించి
కడుపు నింపుకొని
తృప్తితో జీవించే
కళ్లులేని కబోదులు వారు



## 7. మెకానిక్

యంత్రాలను బాగు చేస్తూ
అతడే ఓ యంత్రమవుతాడు
యంత్రాలకతడొక
మాయ మంత్రంగా
మారిపోతాడు
స్వశక్తిలో ముందడుగే
స్వలాభంలో మాత్రం వెనుకడుగే

సైకిల్‌నుండి
విమానం వరకు
కరవాలం నుంచి
కంప్యూటర్ వరకు
బీగం నుంచి
బీరువా వరకు
ఫ్యాన్ నుంచి
పరుగెత్తే రైలు వరకు
రిపేరు చేయడంలో
తనకు తానే సాటి

మరమనిషిలా
మరయంత్రంలోకి
పరకాయ ప్రవేశం చేస్తాడు
ఆటో గ్యారేజిలోనే
నివాసముంటాడు

వినూత్న ప్రయోగాలే
విలక్షణానికి టానిక్కులవుతాయి
బతుకు బండికి
ఇందనమవుతాయి
బండినీ
బతుకు బండిని
ముందుకు నడిపిస్తాయి

అందుకే
విశ్వానికి అతడు మూలిక
విశ్వాసానికతడు ప్రతీక
శ్రమశక్తికి పూడిక
మేధా శక్తికి కూడిక



## 8. కర్షకుడు - సైనికుడు

మేఘాలు వర్షించి
నేలతల్లి పులకరించి
చిగురించిన పంట
చేతికందితే
కర్షకుడు హర్షిస్తాడు

కర్షకవృత్తినే కాంక్షిస్తాడు
హలాన్నే జీవనోపాధిగా గ్రహిస్తాడు
అతడే దేశానికి అన్నదాత
సకల జీవరాసులకు ప్రాణదాత

దేశ రక్షణ శాంతి భద్రతలు
ముఖ్యమని
శత్రుశేషం లేని దేశం కోసం
శ్రమించడమే తన
ధ్యేయమంటాడు సైనికుడు

ఎల్లలు దాటే ప్రతిభను చాటి

విజయకేతనం

ఎగురాలంటాడు

రణరంగంలో

పోరాట వీరుడై

సమరశంఖం

పూరించాలంటాడు

అతడే దేశానికి రక్షకుడు

కర్షకుడు

సైనికుడు యిద్దరూ

భరతమాతకు

ముద్దు బిడ్డలే

భావితరానికి

భవ్యరేఖలే



## 9. కులం - మతం

కులం పేరుతో

దూషించేవారొకరు

మతం పేరుతో

మారణహోమం

సృష్టించేవారొకరు

రక్కసి పొదల మాటున

రాటుదేలిన రాబందువుల మధ్య

నిప్పు గుప్పున రగులుతున్నది

పగలు సెగలై ఎగిసి పడుతున్నది

చెదల్లాంటి కులతత్వాన్ని

ఆదిలోనే తుంచేయాలి

కరుడు గట్టిన మతోన్మాదాన్ని

మచ్చుకైనా లేకుండా చేయాలి

కుల మతాలను సృష్టించిందెవరని?
కులమతాల సారమేమిటని ?
సాటివాన్ని ప్రశ్నించే హక్కు
లేదంటుంది చాందస సమాజం
ప్రశ్నించేవాడికది
జవాబు వెతికే సమస్యేకాదంటుంది
జీవించే హక్కు శూన్యమంటుంది

కులమతాల అడ్డుగోడలే
భావితరాన్ని వేరు చేస్తాయి
చరిత్ర పుటల్లోని కులం, మతం
కాలనాగులై కాటేస్తాయి

జీవిత పథంలో
జీవితమే సత్యం
మన కులం మానవకులం
మన మతం మానవత్వం



## 10. జీవితాన్వేషి

ఒకడు - బాల్యం నుంచి
చరమాంకం వరకు
చావు పుట్టుకలు
శాశ్వతం కాదంటాడు
మూఢ నమ్మకాలతో
మూర్ఖపు ఆలోచనలతో
సిరికల వానికి సరిలేరని
విలాసాలతో విహరించిన
దిశమారితే దశమారుతుందని
ప్రశంసల వెల్లువలో
మునిగితేలాలంటాడు
ఇంకొకడు.....

బతుకును
గతించిన జ్ఞాపకాల
పరంపరగా భావించి
వర్తమానంలో
నిరాశ నిస్పృహల మధ్య
ఊగిసలాడుతాడు

మరొకడు.....

అలుపెరుగని బాటసారిగా
ఓటమెరుగని విజేతగా
సృష్టిలోని అణువణువూ
శోధించాలని సాధించాలని
తవన పడడం
మనిషి లక్షణమంటాడు
అది మానవ సహజమంటాడు

మరొక ఇంకొకడు......
జీవనగమనంలో
ముళ్ళబాటనే
పూలబాటగా మార్చి
"గురి" తప్పుతున్న
బతుకునే వెదకడంకంటే
ఎప్పుడో ఒకసారి
ఎన్నడో ఒకసారి
కలిసొచ్చే అదృష్టమే
'కలకాల'ముంటుందని
భ్రమిస్తాడు



## 11. వలస బతుకులు

ఆకాశమే ప్రశాంతంగా
చూస్తున్న ఆ.... వేళ
విహంగాలు జట్లు జట్లుగా ఎగిరిపోతున్నాయి
సుదూర తీరాలకు తరలిపోతున్నాయి

పుడమితల్లి పురిటినొప్పులు పడుతున్న ఆ..వేళ
తొలకరి జల్లులే కురియని ఆ... వేళ
పంట పొలాలే బీడులై ఎండిపోతున్న ఆ...వేళ
ఆలవాలం కూడా గుంపులు గుంపులుగా
ఎండు డొక్కలతో ఆకలికై
పరుగులు తీస్తున్నాయి

ఆకలి తీరితే చాలనేవారు కొందరైతే
ఆశల ఆశయాలు తీరాలనే వారు మరికొందరు
జీవన యానంలో దారులువేరైనా
బతుకు దారి అదే గదా!
వేటికైన కావల్సింది కూడు, గూడే గదా!

బతుకు వ్యూహంలో
చిక్కిన మనిషికి
ఆశయం ఏదైన
అవసరం ఒకటే గదా !!!

కష్టాల కడలిలో పడిలేచే కెరటంలా
ఎగిసిపడే ఎదసవ్వడిలా
సాగిపోతున్న జీవిత నౌక
తీరం చేరాలనే తపిస్తుంది
బతుకు తెరువు భారమై
జీవన గమ్యం కోసం పరితపిస్తుంది



## 12. ఆటో కార్మికులం

మూడు చక్రాల బండితో
బాల్యమంతా ఆటవిడుపు
మూడు చక్రాల బండే
జీవితమంతా పట్టువిడుపు

ఆటో నడుపుతున్నంతసేపు
కంటికి కునుకే రాదనుకుంటాం
కాసుల కొరతే లేదనుకుంటాం
కాలం గడిస్తే చాలనుకుంటాం

జీవిత చక్రమంటే
ఊటబావిలా భావిస్తాం
ఊపిరి ఉన్నంతవరకు
చేదినకొద్దీ కన్నీరే
మిగులుతున్నదనుకుంటాం

నిదానమే ప్రధానమని తెలిసిన
నిలకడలేని ఆలోచనలతో
వేగంగా ప్రయాణిస్తే
ట్రాఫిక్ అధికారుల దర్శనం
సెన్స్ ఉన్నా లైసెన్స్ లేకున్నా
రవాణాధికారుల విశ్వదర్శనం

ప్రయాణికులు కూర్చున్నంతసేపే
వారితో పలకరింపు
గమ్యం చేరినంతసేపే
వారితో ఆదరింపు
గిరాకీ లేదంటే ఆటో
ఓనరుతో ఈసడింపు
కాసులు కాలేదంటే
ఇంటి ఓనరుతో చీదరింపు

బతుకుబాటలో
ఆటోచక్రమే సంసార చక్రమైంది
సంపాదన చక్రమే
శూన్యమవుతున్నది



## 13. క్షుద్బాధ

ఒడుపు ఉన్నా
'వల' లేని నావికుడు
సముద్రమంతా తిరిగి
ఒడ్డుకు చేరినా నిష్ఫలమే
ఉపాయంరాక
ఉపాధి లేక
శ్రామికుడు
ఊరంతా తిరిగి
గూటికి చేరినా వ్యర్థమే

కష్టాలు
కన్నీళ్లు
ఆకలి దప్పికల
నేపద్యంలో
ఆలోచించే తీరికలో
ఉరుకులతో
పరుగులతో
సాగిపోయే జీవితంలో
మరీచికలను వెంబడిస్తే
దాహం తీరుతుందా ?

ధనం, సుఖం కోరినా
ఆ.. ధనాన్ని
పొలిమేరగా మార్చితే
తనివి తీరుతుందా?
బతుకు దారిలో జీవించాలంటే
బతకడం నేర్వాలి

బ్రతుకడమంటే
శ్రమించడమే
పొడిచే పొద్దు మారినా
నడిచే కాలం ఆగదు
శ్రమించడం తప్పదు

లోకులు
కాకుల్లా పొడిచినా
మాటలే
ఈటల్లాగుచ్చుకున్నా
ఒగిరం కోసమే వేగిరం
ఆ. . . వేగిరమే లేకుంటే
క్షుద్బాదే తీరదు



ఒడుపు ఉన్నా
ఓపిక ఉన్నా
చేతనైన చేవ ఉన్నా
కాలాన్ని
నీవైపు మళ్లించాలి
శ్రమించే దారులు వెతకాలి
చిత్తడిలాంటి బ్రతుకును
పుత్తడిలా మార్చాలి

## 14. ప్రేమికులు

ఊహాజనిత ప్రేమతో
ప్రేమికులెప్పుడు
సరస సరాగాలతో
సంకుచిత దోరణిల
మధ్య ప్రేమమైకంలో
తనవారినే వదులుకుంటారు

అవసరమనుకుంటే
లోకమంతా ఏకమైనా
సాక్ష్యం లేకున్నా
సాక్షి కాదన్నా
మనస్సాక్షితో మనువాడుతారు



నాటి నుంచి నేటివరకు
ప్రేమికులెందరో
ప్రేమ సాఫల్యాలే కరువై
విషాద ఛాయలే అంకురించి
బతుకుదారిలో
గమ్యం తెలియక
మెతుకు తపనకై
కలహాల కాపురంతో
నెట్టుకొస్తారు కొందరు

ఆత్మవంచన చేసుకోలేక
కాలగర్భంలో కలుస్తారు ఇంకొందరు
జీవన సాగరంలో ప్రేమికులు
తీరం చేరితే రాగబంధమే
జతకలిస్తే జన్మజన్మల బంధమే
విడిపోతే తెగిన బంధమే

## 15. వైద్యుడు

ప్రాణం తీయడం
కసాయికి తెలుస్తుంది
ప్రాణం పోయడం
వైద్యునికి తెలుస్తుంది

దవళం
ఆరుణం
హరితం
త్రివర్ణ ప్రభావమే
రోగి ప్రశాంతతకు చిహ్నాలు
రోగి సేవలే తనసేవలు
విరామం లేదు
నిర్లక్ష్యం కాదు
నిరంతరం శ్రమిస్తాడు



సొంతవైద్యం
చెల్లదంటాడు
నాటు వైద్యం
పనికిరాదంటాడు
శాస్త్ర చికిత్సకంటే
శస్త్ర చికిత్సమేలంటాడు
జీవనాడిలో
నిర్జీవ అంగాలకు
చలనం కలిగిస్తాడు
సంచలనమే సృష్టిస్తాడు

రాజీ లేని బతుకులలో
రోగాలేవైన,
రోగులెవరైనా
ఆరోగ్యమే ఆనందమై
సదా - వర్ధిల్లాలంటాడు

మచ్చలేని వైద్య వృత్తికి
వన్నెతేవాలంటాడు
మరపురాని వైద్యునిగా
చెలామణి కావాలంటాడు

## 16. నష్ట జాతకుడు

హస్తసాముద్రికమే
జాతకమైతే
చిలుక జోస్యమే
చిట్టా విప్పుతుంది
అదృష్టమే
తలుపు తట్టితే
తారాజువ్వలా
నింగికెగురుతుంది

విపత్తు వచ్చినా
విధ్వంసం జరిగినా
మెరుపుతీగలా మెరిసిన
తుఫాను లా కురిసిన
తిప్పతీగలా చుట్టిన
జరిగే ఘటనలు
జరగక మానవు

లోకంలో పని లేదని
నిగ్రహంతో ఉంటే
విగ్రహం లా మారుతున్నది
కాసుల కోసమే తపించితే
బతుకే తిరకాసవుతున్నది



మత్తుగా తాగుతూ
తూలుదామంటే
గమ్మత్తుగా గంజినీళ్లతో
సరిపెట్టుతున్నది
బతుకు లెక్కలే సంకలనమైతే
బతుకే వ్యవకలనమవుతున్నది

భ్రమరంలా సంచరిస్తే
సమరంలా భ్రమిస్తున్నది
అదృష్టపు క్రీనీడలో
దురదృష్టమే వెంటాడితే
విలాస జీవితమే
కనుమరుగవుతున్నది
విరక్తితో జీవితమే
చేజారుతున్నది

## 17. ఉద్యోగి - నిరుద్యోగి

కొలువు ఏదైన
కోరిక లేవైనా
ఉద్యోగికి ఉపాదే ఊతం
ఊసులే సోపానం
ఆశల గూడు తన లక్ష్యం
ఆశయాలు తన ప్రతీకలు

కలిమితోనే చెలిమి
చెలిమితోనే సంపద
సంపదతోనే భవితవ్యం
ప్రగతి పథంలో
ప్రపంచపటమే
తన ప్రతిబింబం
ఎదగడానికే ముందుంటాడు
ఎగిరిపడితే కిందుంటాడు



దక్షిణం అడిగిన
ప్రదక్షణం చేసినా
నిరుద్యోగికి
సిఫారసులు లేవు
కాసులసలే కావు
కూటికోసం
కుటుంబం కోసం
భృతికై వెదుకులాట
ఆకలికై బతుకువేట

కొలువులేని వారికి
బతుకు కెరటాల పయనంలో
సుడిగుండంలా
చిక్కుకున్న తెరచాపలే
బతుకు గుండంలో
తలదాచుకున్న చిరుదీపాలే

## 18. వృత్యాసం

ప్రేమా పాషాలనే తుంచుతూ
రాగద్వేషాలనే పెంచుతూ
గెలుపు ఓటముల మధ్య నలుగుతూ
శిలాశాసనంగా తీర్పునిచ్చిన
గెలుపు కోసమే బతుకుపోరు

గెలుపు ఓటములు
సమతుల్యాలు
గెలుపు
ఏ ఒక్కరి సొంతం కాదు
ఓటమి ఎప్పుడూ
గెలుపుకు తొలిమెట్టు
ఆ ఓటమే
గతాన్ని నెమరువేస్తాయి
భావితరానికి
బాధ్యతలు గుర్తుచేస్తాయి
సామాజిక స్పృహనే
కలిగిస్తాయి



ఇది తెలుసుకోలేక
మనసు కుదుట పడక
తుది శ్వాస ఉన్నంతవరకు
బతుకు బాటలో
గెలుపు ఆరాటమే ఎక్కువ
ఓటమితో పోరాడిన
బతుకు మీదే మక్కువ
గెలుపు ఓటముల మధ్య
ఆశించే జీవితమే తక్కువ

## 19. ఫోటోగ్రాఫర్

విధి విచిత్రంగా
వింతలెన్నో సృష్టిస్తున్న
సృష్టిలోనే దాగి ఉంది కెమెరా
కెమెరాలోనే దాగి ఉంది నా దృష్టి
దృష్టి మరల్చక సృష్టిలో
కనిపించే దృశ్యాలన్ని
కెమెరాలోనే బందిస్తాను

ఓటరు కార్డులకు
రేషన్ కార్డులకు
ఐడెంటి కార్డులకు
క్రెడిట్ కార్డులకు
ఫోటోలు లేనిదే
గమనం సాగదు
విందులకు వింతలకు
ఫోటోలు లేనిదే
గుర్తింపు చేకూరదు



కీర్తి శేషుల
ఛాయాచిత్రాలే
శేషులకు
మధుర స్మృతులు
ధరితిలో అవే రేపటి జ్ఞాపకాలు
చరిత్రలో అవే సాక్ష్యాలు

క్షణంలో ఫోటోలు తీసే
ఆధునిక యంత్రాలకు
లక్షలు వెచ్చించిన
లక్షణంగా బతకడం కష్టమే
అయినా. . . .
ఈ వృత్తిలో రాణించడం యిష్టమే

## 20. దోషి

ఆశించినవన్ని జరుగవు
జరిగినవన్ని నెరవేరవు
విధివ్రాతను మార్చలేవు
కాల చక్రాన్ని ఆపలేవు

నీ కోపమే నీ శతృవని
నిజం తెలియక
క్షణికావేశంలో
తప్పు చేస్తావు
దోషిగా నిలబడుతావు
కేసులంటూ
సెక్షన్లంటూ
కోర్టులచుట్టూ తిరుగుతావు

తారసపడేవారే
తప్పించుకుంటే
తలరాతని భాదపడతావు
తర్వాత ఏడుస్తావు
దేవుని పై భారం వేస్తావు



అనుభవించే శిక్ష తప్పదు
ఆలోచించే తీరిక దొరకదు
ఫలితం కారాగార వాసం
అదే నీ నివాసం

ప్రగతి మార్గంలో
మనిషిగా గుర్తించాలంటే
ఆత్మావనలోకం చేసుకో
ఒక్క క్షణం. . . .
నిన్ను నువ్వు తెలుసుకో
అప్పుడు. . . . .
నిర్ధోషిగా నిలబడుతావు
నిలకడగా నిజం నిరూపిస్తావు

## 21. చివరి మలుపు

బతుకు బాటలో
గమ్యం చేరాలంటే
మలుపులు తప్పవు
మలుపులు దాటడం
లక్ష్యం చేరడం
కొందరికే పరిమితం

ప్రవాహంలా సాగే
జీవన గమనానికి
వృత్తిలో ఎన్నో స్పర్థలుంటాయి
ప్రవృత్తిలో ద్వేషాలుంటాయి
అవార్డులుంటాయి
రివార్డులుంటాయి
మెలకువలు ముఖ్యం
నైపుణ్యం అతి ముఖ్యం



ఉన్నవాడే లేనివాడిగా
మారితే అధోగతికి మలుపు
లేనివాడే ఉన్నవాడిగా
మారితే ఊర్ధ్వగతికి మలుపు

అనుకున్నవి జరిగితే
ఒక మలుపు
అనుకోనివి జరిగితే
మరోమలుపు
మలుపులన్నీ
నివురు గప్పిన నిప్పులే
అక్కడే ఆగినప్పుడు ముప్పులే
గమ్యం చేరినప్పుడు ఒప్పులే !

మలుపులెన్ని ఉన్నా
బతుకు బాటలో
చివరి మలుపే
మహోన్నతిగా మార్చుతుంది
మలుపే లేదని భ్రమిస్తే
మట్టిలోనే చేర్చుతుంది

## 22. సంఘ శక్తి

ఖనిలో, గనిలో, వనిలో
శ్రమజీవుల రుధిర బిందువులే
ఘర్మకడలిలో
ఘనీభవించుతున్నవి
బతుకు కడలిలో
అశ్రుబిందువులే
కెరటాలుగా ఎగిసి పడుతూ
ఆవిరవుతున్నావి

కష్టానికి ప్రతిఫలమే లేక
శ్రమ దోపిడీకి గురైతే
ఆకలికేకలే
గుండె చప్పుళ్లవుతాయి
ఎదకవాటం తెరిస్తే
"ఆర్థిక లీలలే" కనబడుతాయి
అప్పుల భాదలే మిగులుతాయి
ఆత్మహత్యలే శరణ్యమవుతాయి



దోపిడీతో కూడిన వ్యవస్థలో
అన్నీ చీకటి కోణాలే
కష్టాన్ని దోచేవాళ్ళే
అవసరానికి వెలకట్టేవాళ్లే
ఎందుకీ వివక్ష ?

ఎక్కడుందీ సారూప్యం?
కార్మికుల వెతలతో పాటు
కారణం వెతకాలి !
కష్టజీవుల లోపాలను విశ్లేషించాలి
కారణం ఏదైన

పరిశ్రమలో లోటుపాట్లు ఉంటే
శ్రమలో తప్పవు ఆటు పోట్లు
శక్తి ఉన్నా విముక్తి కోసమే బుగులు
యుక్తి ఉన్నా భుక్తి కోసమే దిగులు

శ్రామిక వ్యవస్థలో
మార్పురావాలి
శ్రమైక జీవనంలో
చైతన్యం తేవాలి
సంఘటితమే
ధ్యేయం కావాలి
చీకటిలోకంలో
వెలుగు రేఖగా
దారి చూపాలి

అన్నిటికి మూలమైన
సంఘశక్తే ఆయుధమైతే
ఆకలికేకలే
పొలికేకలుగా మారుతాయి
హృదయ వీణ మీటితే
బతుకు రాగాలే చాటుతాయి
అప్పుల భాదలే తీరితే
ఆనందపు గీతాలే వెలుస్తాయి



## 23. శత్రువు

శత్రువంటే వెలిసిపోని కొత్తదనమే
మాసిపోని పాతదనమే
శత్రువుకు
శత్రువే మిత్రుడవుతాడు
శత్రువని నిర్లక్ష్యం చేస్తే
ప్రతీకారంతో వెంటాడుతాడు
మమకారాన్నే తుంచేస్తాడు
ఊహా జీవితం కాదు వాడిది
ఊహించే మనస్తత్వం లేదు వాడికి

శత్రువుకెప్పుడూ
జయం సాధించడంలో
అపజయం పొందితే
కనికరం తెలియదు
కరుడు గట్టిన మనిషవుతాడు

కర్త, కర్మ, క్రియల సాక్షిగా
ఎందర్నో బుగ్గిపాలు చేస్తాడు
మరెందర్నో
కాలగర్భంలో కలిపేస్తాడు

యుగాలు మారినా
తరాలు మారినా
ఉనికి మారనంతకాలం
రహస్యాలను చేధిస్తాడు
రాచపుండులా తొలుస్తాడు
కొత్తరూపు సంతరించుకుంటాడు
కోరికలన్ని తీర్చుకుంటాడు

పంట చేనులో
కలుపుమొక్కలను
వర్తకంలో
కుళ్లిన ఫలాలను
నడిచే దారిలో
రాళ్ళు రప్పలను
ఏరివేసినట్లు
సమాజంలో శత్రుత్వాన్ని
ఏరివేయడమే
ఏకైక లక్ష్యం కావాలి
శతృవునుకాదు,
శత్రుత్వ నిర్మూలనే
ధ్యేయం కావాలి
ఏమరుపాటు లేకుండా
శత్రువును
స్నేహంతో
మనవైపు మళ్లించాలి
అజాత శత్రువుగా మార్చాలి



## 24. మనసు - మనిషి

పంచభూతాల సాక్షిగా
జీవరాసులతో నిండిన
సృష్టిలో జీవించే
ప్రతి జీవి సాక్షిగా
ఉనికి మారాలని,
ఊహలే నిజాలని
ఫలితమే శూన్యంగా,
బతుకునే భారంగా
గుండెనే రాయిగా
మలుచుకుంటూ
ఆవేశాన్ని అగ్నికణాలుగా
ఆలోచనల్ని అంతిమ దిశగా
సాగిపోతూ. . .
మనసులేని మనిషిగా
ఎందుకు జీవిస్తున్నావు ?

శిలలపై చెక్కిన శిల్పాల సాక్షిగా
సూక్ష్మమైన దృక్పథంలో
మోక్షమే లేదని
మనస్సాక్షినే ప్రశ్నిస్తున్నావు ?
ఎదుటి వాళ్లనే నిందిస్తున్నావు ?

జీవిత చక్రంలో
కాల వేగంలో
రాత మారినా
గీత మారినా
మనస్సు పొరల్లోంచి
వెల్లువలా వచ్చే
ఆవేశంలోని ఆలోచనలే
విరబూసే కుసుమాలుగా మారితే
బతుకు సమరంలో
సమతా భావం చాటాలంటుంది
మమతల ఒడిలో లాలించాలంటుంది
మనసున్న మనిషిగా మారాలంటుంది



## 25. ఆశ

ఆకాశం వంక చూస్తూ
నక్షత్రాలు లెక్కిస్తే
ఆశల సౌధానికి
పునాది వేయాలంటుంది మనస్సు

ఎదిగే దారులు ఎన్ని ఉన్నా
ఎంచుకున్న దారి మేలంటుంది
రెప్పపాటు కునుకు లేకుండా
క్షణిక సుఖాలను కాంక్షిస్తుంది
కొత్త జీవితాన్నే కోరుతుంది

స్వప్నలోకంలో విహరించాక
స్వప్నాలు చెదిరితే
ఆశల సౌధం కూలితే
బతుకంతా ఎండమావులే
జీవితమంతా ఎదురు చూపులే

సమస్యల వలయంలో బంధీవై
సాగించే జీవితాన్ని చేధించుటకై
నిరంతరం పోరాటం చేయాలి
నిరాశ నిట్టూర్పులనే పారద్రోలాలి

## 26. స్వార్థపరత్వం

"ధనం మూలం ఇధం జగత్"
భ్రమలో పడి
స్వార్థమే పరమార్థమంటూ
దాసోహానికి దారులు వెతికితే
శ్రమించడమే చేతకాదంటుంది

ధనమే ధ్యేయమంటుంది
త్రిశంకు స్వర్గంలో విహరించాలంటుంది
దైవ చింతనకంటే
స్వార్థచింతన మేలంటుంది

జీవనగమనంలో విధి వక్రించితే
బతుకు చక్రం కూలుతుంది
ధనం మత్తు వదులుతుంది
అగాధంలోకి జారుతుంది



అనుభవసారానికి
ఆదుకునే వారే కరువైతే
కన్నీటి బిందువుల సాక్షిగా
తప్పు దిద్దుకోవాలని
భవిష్యత్తు మారాలని

జలప్రళయానికి ఎదురీదిన
జన ప్రవాహానికి ఆనకట్టలు వేసిన
అర్థమే వ్యర్థమని తెలిసేలోగా
మెతుకే కరువవుతుంది
వెతికే ఓర్పు నశిస్తుంది
బతుకే అనూహ్యమవుతుంది

## 27. నయవంచకులు

జన సమూహంలో
నయవంచకులు
చాపకింది నీరులా
నీతిగా నటిస్తారు,
అవినీతిని పాటిస్తూ
ధనార్జనయే ధ్యేయమంటారు

నమ్మిన వాడినే వంచనతో
నట్టేట ముంచుతారు
స్కీంలంటూ స్కాంలే చేస్తూ,
అవకాశం కోసమే పొంచి ఉంటారు

జీవన సరళిలో
తప్పు చేశాననే భావం
ఏ కోశాన ఉండదు
తలంపులతో చెలరేగే భావాలే
తమ తీర్పంటారు

జన జాగృతిలో
చేసిన మోసం తెలిసిన
వంచకులుగా ముద్రపడిన
గతంతో పని లేదంటారు
గమ్యాన్ని మార్చుతారు

నయవంచకులుగా
చెలామణి అవుతూ
చరిత్ర హీనులుగా
మిగిలిపోతారు

## 28. వర్తకుడు

వర్తకుడికి కావల్సింది
లాభమే కాని
కన్నీటి కథలు కావు
కలలుగనే వెతలు లేవు

నష్టాన్ని చవిచూస్తే
కష్టాన్ని తెచ్చినట్లే
సరుకులు లాభాలకై
అమ్మడమే అతని వృత్తి
సంతలో వింతలెన్నో
చేయడమే ప్రవృత్తి

వాణిజ్యాన్ని విస్తరించి
తన పరిధిలో గిరిగీస్తే
లాభాల వేటకై అన్వేషణ
లాజిక్కులెన్నో ప్రదర్శన
లతాంగులతో ఆకర్షణ



జీవన మూలంలో
స్వార్థమే నిస్వార్థమైన
శేషమే తన గమనం
శ్లేషమే తన జీవితం

వర్తమానంలో
వంచనకు రూపమే వర్తకం
వర్తకంలో
మాటల కంటే 'మూటలే' ముఖ్యం
ఇది జగమెరిగిన సత్యం

## 29. అర్థప్రయోగి

పరుల బలహీనత వెదుకుతూ
వాయిదాల పద్ధతిలో
తాకట్టుకు వెలకట్టి
చక్రవడ్డీని ఆశిస్తాడు

అవసరానికి స్పందించే
మనసులేని రక్కసునివలె
బొంగరంలా తిరుగుతూ
రుధిరాన్ని జలగలా పీల్చుతూ
బొమికలే మిగలకుండా
బూడిదలా కాల్చుతాడు

నక్షత్రకుని వలె
నరకాన్ని చూపిస్తాడు
నడకనేర్పిన,
నడత మార్చిన
కనికరం లేనివాడు
కనికట్టు తెలిసిన వాడు
పిసినిగొట్టుగా బ్రతుకుతాడు



అర్ధ ప్రయోగమే
ప్రగతికి మార్గమంటాడు
ప్రతిఫలమే ప్రయోజనమంటాడు
ధనపిశాచాన్నేదైవమంటాడు

గమ్యస్థాన చలనంలో
సాఫల్యాలే వైఫల్యాలైతే
ఋణగ్రస్థులే నామంపెడితే
కరుణించేవాడే కరువవుతాడు
ఏకాకిగా మిగిలిపోతాడు
అర్థప్రయోగానికి
అర్థమే మారిపోతుంది

## 30. మాయావి

చెట్టుకొమ్మకు వ్రేలాడుతున్న
పిచ్చుక గూళ్లవంక
పడి ఉందొక మాంసపుముక్క
వాటిని ఆశగా చూస్తూ
తినాలనుకొందొక నక్క

నక్కనే భక్షించాలని
చేరిందొక ముసలిచిరుత
తననే చూస్తుందనుకొన్న నక్క
తెలివితో శవంలా పడిఉంది

మృత కళేబరమనుకొని
దొరికిందే చాలనుకొని
మంసపు ముక్కను
పట్టుకెళ్లిందా చిరుత!



మెల్లిగా లేచిన నక్కకు
మాంసపు ముక్కే దొరకలేదు
పిచ్చుక గూళ్లే కనబడలేదు
ఆశ ఉన్నా నిరాశతో
దీనంగా
హీనంగా
పరుగు లంఖించింది

ఈ దృశ్యాన్ని ఏటిఒడ్డున
కూర్చున్న ఒకమనిషి గమనించాడు
నక్క నటనను వీక్షించాడు
తన బతుకు దారినే మళ్లించాడు
అతి తెలితో నక్కనే మించిపోయాడు
పంచేంద్రియాలే ఆధీనమంటూ
పంచ తంత్రాన్నే మరిపించాడు
మాటలతో 'కోటలే' కడుతూ
'మాయావి' గా మాయలెన్నో చేస్తూ
మరోలోకాన్నే సృష్టిస్తున్నాడు

## 31. మధ్యవర్తి

ఇద్దరి వ్యక్తుల మధ్య
వాద వివాదాలకు
అతడే పరిష్కర్త
స్థలాలకు
భవనాలకు
క్రయ విక్రయాలకు
తాకట్టు వస్తువులకు
అతడే సృష్టికర్త
సమస్యల విషవలయంలో
అతడే సంధానకర్త

ఉపాధి సిఫారసులకు సారధి
అప్పు ఇచ్చు పుచ్చుకునే వారికి వారధి

కళ్యాణం చేయించడంలో సంచారి
కలహం సృష్టించడంలో రాయబారి
అడ్డి దుకాణంలో దళారి



బతుకు బాటలో
నామాలు వైరైన
నటించడంలో మధ్యవర్తి
నమ్మించడంలో చక్రవర్తి

ఆలోచనా పర్వంలో శకుని మామే
ఆచరణా రీతిలో వీరాభిమన్యుడే
అంతిమ తీర్పుకు యోగ్యుడే
అవకాశం కోల్పోతే అయోగ్యుడే

## 32. ఓపిక - తీరిక - కోరిక

మహాత్ముడే మళ్ళీవచ్చి
నవసమాజస్థాపనకై
హితబోధ చేస్తే
వినేవాడికి ఉండదు 'ఓపిక'

కాలం విలువ
కాసుల తపన
కరిగిపోతున్న ప్రాయం
వృథా చేయడానికి
ఉండదు 'తీరిక'

తనివితీరని దేహం
తరలిపోని మోహపాశం
ఆకాశపయనం
హంసతూలికా శయనం
కుబేర నేస్తం
భస్మాసుర హస్తం
అయినా.....
విషవలయంలో చిక్కి
కాంక్షిస్తుంది 'కోరిక'



## 33. రేపటి మనిషి

మూడడుగుల నేలను కోరిన
వామనుడే తన గురువని
అవకాశమొస్తే భూమండలాన్నే
గుప్పిట బందించాలంటాడు
పైశాచకత్వాన్ని ప్రదర్శిస్తూ
జనారణ్యంలో రాక్షసునిలా
సంచరించాలంటాడు

నవీన రీతిలో నటిస్తూ
కట్టుబాట్లను త్యజించి
కాంక్షలతో
కాసులతో
భక్తి - ముక్తి
ప్రస్థావనే లేదని
కుయుక్తులతో
ధనకీర్తే మార్గమని
ధరణిమీద
బతకడం కంటే
అంతరిక్షమే
స్వర్గదామమంటాడు

మరయంత్రంలాగా
అహోరాత్రులు
ఆశల రెక్కలతో ఎగిరి
చుక్కలతో లెక్కలు కట్టుతాడు
ఆశలేని మనిషే వ్యర్థమంటూ
కంటికి కునుకు లేకుండా
రేపటి రూపాన్నే
సృష్టించాలంటాడు

అందినంత ధనమున్న
అధికార దర్పమున్న
మనిషి ఉన్నతిగా చేసిన
మహోన్నతిగా మార్చిన
చివరికి చేరేది మట్టిలోనే గదా !

బంతిని ఎంతపైకి విసిరినా
చేరేది నేల మీదికే గదా !!
గొప్పోడి గోత్రాలైన,
పేదవాడి బతుకు చిత్రాలైన
కంచికి చేరని కథలన్నీ
భూమ్మీదికి రావల్సిందే గదా !!!



సప్త వ్యసనాలకు బానిసైతే
మితిమీరిన ధన వ్యామోహమే
మనిషి పతనానికి తొలిమెట్టు
అదే చివరి మెట్టు

ఏ మనిషికైనా
ఆయువు మూడితే
చిత్రగుప్తుడే చిట్టా విప్పితే
కాలయముడే, ఆహ్వానిస్తే
'రేపటిమనిషి' కూడా
రెపరెపలాడే 'గాలిపటమే'
గోడకు వ్రేలాడే 'చిత్రపటమే'

## 34. విమర్శకుడు

విమర్శ ఉంటేనే గుబాళింపు
అది లేకుంటే
పోపులేని తాళింపు
చాటింపులేని గుర్తింపు

తప్పొప్పులను
సమంగా విమర్శిస్తేనే
విమర్శకుడవుతాడు
విమర్శకుడెప్పుడూ
విజ్ఞుడే - ప్రాజ్ఞుడే
సహృదయుడే

కాలగమనానికి దిక్సూచి
తారతమ్యాలను తెలిపే దూరదర్శి
ప్రగతి బాటకు మార్గదర్శి



## 35. బతుక నేర్చిన వాడు

జీవనగమనంలో
బతికి చెడిన
చెడి బతికినా
యిద్దరూ - నాణానికి
బొమ్మా-బొరుసులే
బతుకు బాటలో
దారితప్పిన వాళ్ళే
దోపిడీ వ్యవస్థలో
దగాపడిన వాళ్ళే
అయినా.....
కర్మభూమిలో ప్రత్యక్షసాక్షులే

ఋణశేషమున్నా
శతృశేషమున్నా
బతికినంతవరకే
ప్రమోదమనుకున్న
ప్రమాదమనుకున్న
గుప్పిట మూసినంత వరకే
విప్పినప్పుడే గుట్టు తెలుస్తుంది
చెప్పినప్పుడే మనసులోని
వ్యథ తీరుతుంది

రెంటికి చెడినవాళ్ల మధ్య ఉన్నావాడు
బతుకంటే ఏమిటో నేర్చుకుంటాడు
సాటివాడే తనకు గుణపాఠమంటాడు
చేసేవృత్తిని వలయంగా మార్చుతాడు

జనమే మనమని
మనమే జనమని
రచ్చబండకాడ
రాచకార్యాలెన్నో చేస్తాడు
గోడమీద రాతలెన్నో రాస్తాడు
తవ్విన కొద్దీ
బంగారమేనంటాడు
స్వేచ్ఛగా
బతకడమే మేలంటాడు

గూడు చెదిరిన
గుట్టు తెలిసిన
దారితప్పిన
దగాపడిన
సుపథమైన
విపథమైన
జీవిత చక్రం మాత్రం
కరెంటు మీటర్లో
"ఎర్రచక్రం"లా
ఎప్పుడూ సంకేతమే
బతుకనేర్చిన వాడికది
నిత్యం సందేశమే



## 36. ఓ మనిషీ తిరిగి చూడు !

బతుకు మీద ఆశతో
వృత్తిని ఆరాధించిన
ప్రవృత్తిని ప్రేమించిన ...
పరిసరాలను బట్టి
పరిస్థితులే మారుతున్నాయి
పరిణామాలే చేరుతున్నాయి

విధి ఆడించే వింత ఆటలో
భౌతిక కాంక్షలు తొలకరిస్తున్నాయి
నైతిక విలువలు అంతరిస్తున్నాయి
మేధాక్షేత్రంలో స్వేదబిందువులు
మొలకెత్తే భీజాక్షరాలవుతున్నాయి

దురాలోచనకు దూరంగా
ఆలోచనలకు ఆలంబనగా
అహర్నిశలు శ్రమించితే
మనసులోని భావాలు
అనుభవాల పుట్టలవుతాయి
ఆచరణలో గట్టులవుతాయి

యుగాలు నడుస్తున్నా
శతాబ్ధాలు గడుస్తున్నా
వ్యవస్థలోని అవస్థలను
విశాల ప్రపంచంలో
విశదీకరించినా
కాలం విలువలను
లోకం పోకడలను గుర్తించినా
గమనం చేరడం ఆగదు
జీవనం సాగించడం తప్పదు

ఏ శాస్త్రం తెలిసినా
ఏ రంగం చూసినా
సమస్తం తెరిచిన పుస్తకమే !
పుస్తక పుటల్లోని
గతాన్ని తరచి చూడు!!
వర్తమానంలో తెరచి చూడు!!!
బతుకుబాటలో తిరిగి చూడు!!!!



# రచయిత పరిచయము


## వేముల శంకర్

| | | |
|---|---|---|
| జననం | - | 11-06-1964 |
| జన్మస్థలం | - | గ్రా. ఇల్లంద, వరంగల్ జిల్లా. |
| తల్లి | - | కీ॥శే॥ వేముల ఐక్కమ్మ |
| తండ్రి | - | కీ॥శే॥ వేముల లక్ష్మయ్య |
| సహధర్మచారిణి | - | పద్మావతి |
| సంతానం | - | అన్వేష్, **B.Tech** |
| | | అనూష, **B.Sc. (Comp.)** |
| చిరునామ | - | ఇం.నెం. 3-9-212, శాలివాహన నగర్, రెడ్డి కాలనీ, హన్మకొండ 506 001. ఫోన్ - 0870 - 2452489, సెల్ - 9849283870 |


ముద్రిత రచనలు :

1. చరిత్ర కందనికీర్తి (పెయింటర్ల జీవిత గాథలు)
2. బతుకు బాటలో (కవితా సంపుటి)

అముద్రిత రచనలు :

1. జీవితమన్నాక (దీర్ఘకవిత)
2. పసిడి పిందెలు (కవితా సంపుటి)
3. తెరమీది బొమ్మలు (వ్యాస సంపుటి)

ప్రస్తుతం :

**A.P.** పెయింటింగ్ అసోసియేషన్ బోర్డ్ సెక్రటరి.
తెలంగాణ రంగు కార్మికుల ఐక్యవేదిక జిల్లా అధ్యక్షులు.